తే. గీ. ఏడ నున్నాఁడె యోసి! నీ యిష్టుఁడిపుడు?
కన్నె పడుచుల మఱగిన ♦ కాముకుండు
బ్రహ్మనిష్ఠులఁ గడపిన పాపకర్ముఁ
డేడ నున్నాఁడె పతి యగు ♦ నేని వేగ
వచ్చి కాపాడుకొనుఁగాక ♦ వనిత! నిన్ను
నెఱుఁగవో కాక యిపుడేను ♦ దొరకఁబట్టి
డేగపాటునఁ గలఁగు టి ♦ ట్టిభినిఁబోలె
గ్రమ్మి పైఁబడితి నింకేమి ♦ మిడికె దీవు.

అని నిశ్చయము శ్రీశైలమునకుఁ గొనిపోయి శరీరమును నువ్వుగింజలంత ముక్కలుగాఁ గోసివేసి పక్షిచచ్చునట్లు చేసెదను. [మాలతిని దీసికొని నిష్క్రమించుచున్నది.]

మద — నేనును మాలతివెనుకనే పోయెదను. [ఇటునటు నడచి] చెలీ! మాలతీ!

లవం — [ప్రవేశించి] చెలీ! మదయంతి కా! నేను లవంగికనే.

మద — చెలీ! మహానుభావునిఁ జూచితివే?

లవం — లేదు. అతఁడీ తోఁటపాలిమేర దాటఁగానే కలకలధ్వని విని కార్యమువచ్చి వైరివీరుల లెక్కగొననట్లు తొడలు చఱచుకొనుచుఁ దెంగుచు బయుపువాటి యొక్క నిమిషములో శత్రుసేనలో వెళ్ళిపడెను. అంతట మందభాగ్యురాలనగు నేను "హా! మాధవ! హా! మహాభాగ! హా! మకరందా! హా! సాహసిక!" యని గుణానురాగులై యింటింటను పౌరు లుచేసిన విలాపముల నాలకించుచు వెనుకకు మరలితిని. మహారాజును వారిని విప్రలంభవృత్తాంతమును విని యాగ్రహగ్రస్తుఁడై తత్క్షణమే తన సైన్యము నంతయు యుద్ధరంగమునకుఁ బంపి మేడ మీఁదియంతస్తుపై నెలవై కూరుచుండి చూచుచున్నాఁడఁట.

మద — అయ్యో! మందభాగ్యురాలను! చచ్చితింగదే!

లవం — చెలీ! మఱి మాలతి యెక్కడనున్నది?

మద — అది నీవుపోయిన తెఱవువంకం జూచుచు కప్పునే బయలు దేఱినది. ఆ వెనుక నేను దానిం జూడలేదు. ఉద్యానగహనము లోనికిం బోయియుండ వచ్చును.

లవం — [కొందఱతో నిటునటు దిరుగుచు] చెలీ! జాగు సేయక వెదకుదము. నా ప్రియసఖి పట్టి పిటికిగుండె. ఇటువంటి సమయములో వన విహారమునకుం బోవునని నేం దలంపను చెలీ! మాలతీ! చెలీ! మాలతీ! యెం దున్నావు? [అని యిటునటు దిరుగుచున్నారు]

కల — [సంతోషముతోం బ్రవేశించి] అమ్మయ్యా! దేవుని పుణ్యా మాయని దెబ్బలులేకుండం దప్పించుకొని బైటంబడినాను. ఏమి శత్రు సైన్యము! ఎంత భయంకరము! ఇప్పటికిని నా మొగమున వ్రేలుచున్నట్లే యున్నది. ఎడతెఱపి లేక నెఱిపోటుబంట్లు జరీనందూసి ఝళిపించిన విచ్చు కత్తుల వాతులు ధళధళమను పండువెన్నెలం దళదళమని మెఱసి యెంత భయంకరముగ నుండెను! చెడం ద్రాగి మత్తుగొని సత్తువకోలంది నువ్వెత్తుగం బట్టిత్రోయు బలరాముని చేతి మేటి నాగేటిత్రోపునకుం దెరలి తిరుగుడువడి కొట్టుకొని బొబ్బరించు యమునానదీ ప్రవాహమువలె నేమి రణగుణధ్వని! మకరందుండు మాఱులేక మలసి చెంగునం గుప్పించి కుడియెడమలులేని చెలంగాటగా సేనలనెల్లం జీకాకు పఱుపంగా నప్పుడు వాండ్రు పట్టుండు! కొట్టుండు! నఱుకుండు! పొడువుండు! అని బొబ్బరించుచుం జేసిన కోలాహలము దిక్కులం బిక్కటిల్లిపోయినది. మఱి మా యజమానుండు మాధవుండు గారి పరాక్రమమో! వజ్రపంజరమువలె దారుణమైన భుజయుగళము నప్పళించుకొనుచు, బెట్టిదుండయి పయింబడి కొట్టు తనదెబ్బలకు నోదలం తూంట్లువడి బొబ్బలిడుచు నేలవ్రాల వైరివీరుల చేతుల కత్తికటారుల వెఱపు

శా॥ పెఱికిప్రచ్చుకొని విచ్చలవిడి కాలరుల నలికి నుగ్గునూడి తఱిమివైచి యిట్లు పలుతెఱంగుల విక్రమించిమించినిర్వర్తితసర్వారి నిర్మథనవిషమ సాహసుండయి స్వైరముగ విహరించినాఁడు. ఓహో! ఆమహారాజుగారి గుణానురాగ మేమని చెప్పవచ్చును? సౌధశిఖరము మీఁదఁ గూర్చుండి చూచుచుఁ బ్రతిహారులు మనవిచేసికొన్న వినయవాక్యములచేఁ గ్రోధము శాంతినొందఁగా ప్రసన్నముఖుఁడయి, యప్పుడే మాధవునిఁ బిలిపించి యాతని ముఖారవిందముఁ జూచి, సందడిసేయకుఁడని తనచుట్టునున్న వారిని సారెసారెకు వారించుచు, నాతని యూరును బేరును నడిగి తెలిసికొని, యుద్ధ మాతీరుగఁ [illegible] కిష్టపడనట్లు కోపదృష్టితోఁ గొఱకొఱలాడుచున్న భూరివసువుగారి వంకఁ బ్రసాదమేదురముగాఁ జూపు నిగిడించి మధుర గంభీరభాషణములతో "మీరిప్పు డెందుకు విచారించెదరు? త్రిభువనాలంకారులును నవయౌవన గుణాభిరాములును మహానుభావులును నగు నిటువంటి యల్లురను బడయఁగంటిమని యానందమును బొందుఁడు." అని చెప్పి రాజుగారు లోనికిఁ బోయినారు. వీరుగో! మాధవమకరందులు వచ్చుచున్నారు. నేను పోయి భగవతి కీవృత్తాంతమును నివేదించెదను. [అని నిష్క్రమించుచున్నాఁడు.]

లవం—చెలీ! మదయంతికా! ఇది నీకు సంతోషకరమైన వార్త. మాలతికిని అటువంటిదే. రమ్ము. దానిని వెదకుదము. [అని నిష్క్రమించుచున్నారు.]

[తరువాత మాధవమకరందులు ప్రవేశించుచున్నారు.]

మాధ—ఓహో! చెలికానియొక్క ప్రబలమైన సహజవిక్రమ మనన్యసామాన్యముగదా !

ఉ. చేతులఁ బట్టి కొట్టి పొడి ♦ సేయఁగఁ గూలెడి యొంపగూండ్లుగా
వే తునుమాడి ముందరిపు ♦ వీరుల, వెన్కఁ ద దాయుధంబులన్

ద్రెంచి

ఖ్యాతినటించు నీదు సమ ♦ దగ్గలలద నరుండఖండచం
డాతతభండవాంబుధికి ♦ నావల నీవల రాతిగట్లునాఁ
జేఁతలు దక్కి నిల్చి రెడ ♦ సేయక శత్రుపదాతివర్గముల్. ౯

వయస్యా! ఇది తలఁచుకొనఁగానే పశ్చాత్తాపము కలుగుచున్నది సుమీ! చూడు.

మ. పౌలఁతుల్ పుక్కిటఁ గ్రోలి శేషము లిడం ♦ బొండొనిసీధోత్సవం రాత్రి
బుఁ యం దిందుమయూఖఖండనిచితం ♦ పున సీధువుం గ్రోలి వా
రల కౌఁగిళ్ళ సుఖించుచిప్పుడెయ్యుద ♦ గ్రత్వద్భుజా ఘాతని
ర్దళితాంగాస్థికలౌచు దూఱెద రసా ♦ రంబంచు సంసారముల్. ౧౦

ఈ మహారాజు సౌజన్యము మఱవఁదగ్గదికాదుసుమీ! మనము సాపరాధుల మయ్యును నిరపరాధులనువలెనే యాదరించి మనమీఁద నెంతో ప్రీతిఁ గనఁబఱచినాఁడు. కాఁబట్టి యిప్పుడు మాలతీసమక్షమందు మదయంతికాహరణ వృత్తాంత మంతయుఁ జెప్పుకొని సంతసింతము. [ముందు వైపుచూచి] ఏమిది యిక్కడ నెవ్వరు లేనట్లున్నది!

మక — మఱేమి లేదు. మనము యుద్ధమునకుఁ బోతి మని కళవళపడి యేమియుఁ దోఁచక వారిందందుఁ దిరుగాడుచు నీతోఁటలోనే యెక్కడనో ప్రొద్దు పుచ్చుచుందురు.

మాధ —

చ. పెనఁకువసుద్దు లీవు విని ♦ పింపఁగఁ జిర్నగవూను మాలతీ
కనకనిభాంగి దన్నుఁ గడ ♦ గంట నదల్చి కనన్ జుగుప్సనాం
దిన దయి విప్పకన్బొమల ♦ త్రిప్పల నొప్పెడి యాననాంబుజం
బును జెలి వంచుకోఁ గలుగుఁ ♦ బో! సఖ! చూపు చలింపకుండఁగన్.

ఇదే యుద్యాన ప్రదేశము. [ప్రవేశము నభినయించుచున్నారు.]

లవం—మద—చెలీ! మాలతీ! [చప్పున జూచి సంతోషముతో] వీరుగో మహానుభావులు పూర్ణమనోరథులై వచ్చినారు.

మాధ—మక—చెలులారా! మాలతి యెక్కడ నున్నది?

లవం—మద—మీ కాలిచప్పుడు విని మాలతి యనుకొని యీ మందభాగినులు వంచింపఁ బడినారు.

మాధ - అయ్యో! మీ రిరువురు నా హృదయమును వేయి వ్రక్కలు చేయుచున్నారు. అదియేమో స్పష్టముగాఁ జెప్పఁగదరే!

తే. గీ. చెలియ కెపు డేమియొగ్గు వా ♦ టిలునో యనుచు
నడలుచుండుదు నెపుడు నా ♦ ంతరాత్మ
నయ్యయో యిప్పు డెవమ క ♦ న్నదరఁ జొచ్చెఁ
బయిగ మీ పల్కు విని యింక ♦ బ్రతుకఁ గలనె? ౧౨

మద - అప్పుడు మీ రట్లు బయిలుదేఱి వెళ్ళఁగానే మాలతి యవలోకితాబుద్ధరక్షితలను భగవతియొద్దకుఁ బంపి "అపరిమత్తులరై యుండఁ గోరుచున్నానని యార్యపుత్త్రునితో మనవిచేయవే" యని మీ కడకు లవంగికను బంపినది. పిమ్మట నేమియుఁదోఁచక, లవంగిక పోయిన తెరువు వంకఁ జూచుటకు వెడలినది. అటుపయిని నేను దానిం జూడలేదు. అంతట మేమిరువురము నిందలి చెట్లతోఁపు లన్నియుఁ గలయ వెదకితిమి. అయితే మీకును గనఁబడలేదు?

మాధ — హా! ప్రియురాలా! మాలతి!

ఉ. ఏదో యమంగళంబు ఘటి ♦ యిల్లెఁగదే! చెలి! క్రోడిగాల కిం
దాదరువైన వేళయఁటె? ♦ యాదట దర్శన మీయరాదఁటే?
వాదఁటె? లేదఁటే దయల ♦ వంబును? బల్కక టాడరాదఁటే?
వేదనపాలు సేయుదఁటె? ♦ వెన్కటి శోధన గూడిరాదఁటే? ౧౩

మద - లవం - హా! ప్రియసఖీ! యెందుఁ బోతివే?

మక - చెలికాఁడా? ఏమి యిట్లు వెఱ్ఱిపడి విలవిల లాడెదవు?

మాధ - వయస్యా! మాధవునితోఁ జెలిమి చేసి యది పద్దబావము

ఉంను ఆశలెల్ల సరిచేసికొని యది నడచిన నడవడియు నప్పుడే మఱచితివా?

మక - ఇది యొక్కటి యున్నది మఱి. భగవతిపాదపీఠమును దర్శింప వెడలినదేమో! కనుక రమ్ము అక్కడకే పోదము.

మద - లవం - అవును. ఇదియును సంభావ్యమే.

మాధ - సరే. అట్లే కానిండు. [అని నడచుచున్నాఁడు.]

మక - [తనలో]

మ. చెలి కామందకియింటికై వెడలుటే • సిద్ధఁబుగాఁ దోఁచెడుం;
దెలియన్ రా దటుపైని ప్రాణములతో • దేవీగృహంబుం గనన్
గలదో లేదో నిజంబు; ప్రాయికముగన్ • సౌదామినీస్ఫూర్తిచం
చలమౌఁ గాదెసుహృత్ప్రియా ప్రజనతా • సంగాదిసౌఖ్యంబిలన్.

[అందఱు నిష్క్రమించుచున్నారు]

అష్టమాంకము - సంపూర్ణము.

# మాలతీమాధవము

## నవమాంకము

రంగము : బృహద్ద్రోణీపర్వతారణ్యము.

[తరువాత సౌదామిని ప్రవేశించుచున్నది.]

సౌదా:- నేను కామందకీ శిష్యురాలనగు సౌదామినినిగదా! కనుకనే యామెకుఁ బ్రేమభూమియగు మాధవుని నన్వేషించుటకు యిప్పుడు పూజ్యమైన శ్రీశైలమునుండి యీపద్మావతికి వచ్చితిని. ఇక్కడ, మాధవుఁడు మాలతి నెడఁబాసినవాఁడై పరిచితప్రదేశములం దిరుగ నోడి యిల్లువిడిచి సుహృద్వర్గముతోఁ గూడి బృహద్ద్రోణీపర్వతాగణ్యమందుఁ బ్రవేశించినాఁడఁట. నేనును అక్కడకే బోయెదను. ఆహా! నే నిప్పుడాకాశమార్గమున నెగిరి వచ్చుచుండఁగాఁ గుప్పవోసినట్లు కొండలు కోన లేళ్ళు కోళ్ళు పల్లెలుం బట్టణములుం గన్నులఁ గప్పివేసినవి. [వెనుకవైపుచూచి] ఆహా!

శా. మేడల్ మిద్దెలు గుళ్లు గోపురములున్ ♦ మిన్నెత్తువై నిక్కి రా
పాడన్ బీఁటలువాఱి కూలి పడిన ♦ ట్లైయభ్రమేపాఱెడున్
జోడై నీటగు తేటనీటిపసమైఁ ♦ జూపట్టె పద్మావతిన్
గూడం బాఱెడి సింధుపార్శ్వపయిం ♦ దోతెంచి చింబక్రియన్. ౧

మఱియు,

మత్తకోకిల. చూఁడియావులు లేఁతపచ్చిక ♦ జొంపముల్ దరిదాపులౌ
బీడులం దిరుగాడి తోల్కరి ♦ వేళ నాదట మేయఁగా
వేడుకల్గని కాపు లెల్లరుఁ ♦ బేర్మిఁ దేని నుతింతురో
చూడనా లవణానదీమణి ♦ చుట్టివచ్చు కరుళ్ళతో. ౨

[మఱియొకవైపు చూచి] అదిగో! భగవతి సింధునది. పర్వతశిఖరమునుండి క్రింది భూమియుదరి బ్రద్దలగునట్లు ధారాపాతముగాఁ బడుచున్నది.

శా. ఈరోదఃపేర్మి యారవుర! ♦ యేమనవచ్చు? నవాంబుగర్భగం
భీరఘనాఘనస్తనిత ♦ భీషణమై, సవిధావనీధరో
దార్యలతావితానముల ♦ యందు నమందగతిం జెలంగుచున్
వారణవక్త్ర భూరిగళ ♦ నాదముతో సరిసేయ నయ్యెడున్.

ఇవిగో చందనాశ్వకర్ణసరళపాటలాది వృక్షములచే దట్టములయి, మారేడుపండుల పరిమళంబుల వెదఁజల్లుచు నీయరణ్యగిరిభూములు, ఓహో! తరుణకదంబజంబూవనంబులు నిబిడంబుగ నల్లమి కొన నిరులుగవియు గురుతరగిరినికుంజపుంజంబుల, గుంజదంభీరగద్గదోద్గారఘోర ఘోషణంబుగఁ జెలఁగి పాఱు గోదావరి రవంబులకు మాఱుపలుకు నితంబదేశములతోడి దక్షిణదేశ పర్వతారణ్యములం దలఁపించుచున్నవి. ఇందే యీమధుమతీ సింధుసంగమును బావనము సేయుచు భగవంతుఁడైన భవానీపతి స్వయముగ వెలసి సువర్ణబిందుఁడన వెలుఁగొందుచున్న వాఁడు. [ప్రణమిల్లి]

క. జయదేవ! భువనభావన!
జయభగవ! న్నిఖిల వరద! ♦ జయనిగమనిధీ!
జయరుచిర చంద్రశేఖర!
జయమదనాంతక! వృషధ్వ ♦ జ! జయాదిగురో!

[నడచుట నభినయించి]

కవిరాజ.

తొలుకరిమబ్బుల నిల్కడ నల్లగఁ ♦ దోఁచెడియొత్తగునెత్తములం
జెలఁగి ముదంబున నాఁడునెమళ్ళొగిఁ ♦ జేసెడి కేయనునాదములం
బులుఁగులుఁగట్టిన చిత్రపుగూఁడుల ♦ భూజములన్నను పై నయొడల్
గలిగి యిదే బృహదశ్మమహీధ్రము ♦ కన్నులపండువు సేసెడుగా.

ఉ. ఇందలి కేళిలోయలందు వసి ♦ యించెడి కోడె యెలుంగు బంట్లొగిం
గ్రంపుగ నోటితుంపురులు ♦ గ్రప్పెడు మాటికిఁ దుప్పతుప్పనన్
మందటఁ జెంపు వాండెసును ♦ మత్తగజ ప్రవిభిన్న సల్లకీ
గ్రంథులఁ గాఱు క్షీరశిశి ♦ రస్ఫుట తిక్తకషాయగంధముల్. ౬

[పయిఁ జూచి] ఓహో! మధ్యాహ్నమైనదే! ఇప్పుడు.

సీ. విడిచి క్రొవ్వయినగు ♦ మ్మ్రుదుమ్రాను దట్టంపుఁ
జిగురాకు కొంపముల్ ♦ చెలువు మీఱు
తేలచెట్టునకుఁ బా ♦ తెను గ్రుడ్డికొక్కెర
పూర్ణి కల్ తటభూమిఁ ♦ బొలుచునూనె
యగిసె ప్రాఁకుల ప్రాలి ♦ యశ్వె యుగములంటి
దగగొన్న వగుటచే ♦ మగిడి నీటి
కందువల్ సెమకంగఁ ♦ గదఁగి పాటెడు సెమ్మి
తొట్టమఱుంగుల ♦ దూరి కాల్ల

తే. గీ. కంఠకములుండెఁ; గ్రిందను ♦ గంపపులుగు తేటమ పిట్టల
లంగలార్చెడు గొంద్రుగొం ♦ డ్రనుచుఁ జెంతఁ
బూవుఁ బొదరింటి గూఁడులఁ ♦ బావురమ్మ
లడరఁ జేసెడి హుంకార ♦ మనుసరించి. ౭

సరే. ఇప్పుడు మాధవమకరందులను వెదకి వచ్చిన కార్యమును జూచు కొనియెదను. [అని నిష్క్రమించుచున్నది]

[వి ష్కం భ ము]

--O--

[తరువాత మాధవమకరందులు ప్రవేశించుచున్నారు.]

మక - [సకరుణముగా నిట్టూర్పు పుచ్చి]

ఉ. చూపిన యాసపైఁదగులు ♦ సూపకయున్ విడనాడలేకయుం
ద్రోపడి మోహపుం దమము ♦ లోఁగొనఁగానుచు నుండు డెందమే
యాపదచేత, నందుఁ బసు ♦ లట్టులు సేయున దేమిలేకయో
ప్రాపటియుంటి మిందఱము ♦ వక్రపుదైవము చెల్లునెక్కటా. ౮

మాధ:- హా! ప్రియురాలా! మాలతీ! యెందుఁ బోతివే? అడపాడగానరాక యట్టె మాయమైతివే! ఓ నిష్కరుణురాలా! నన్ను దయఁజూచి సంభావింపఁగదే!

చ. ప్రియునిఁగ మాధవున్ వలపుఁ ♦ జేతమి నేలినదాన నేల నా
పయిదయ లేదు నీకు? విను ♦ వాఁడని నేటొకఁ డున్నవాఁడకో?
స్వయముగ, మూర్తిమంతమగు ♦ పండుగువోలెను రమ్యకంకణో
దయము భవచ్ఛయంబొసగి ♦ హర్షము సేసిన నాకునన్యుఁడై. ౯

వయస్యా! మకరంద! లోకములో నంతటి యనురాగము నిరుపుట దుర్లభముసుమీ!

చ. వెలఁది యనుక్షణంబు నతి ♦ భీకరమై మదన జ్వరంబు బె
ట్టలమటఁబెట్టఁ బుష్పమృదు ♦ లావయవంబులతో సహించెగా
తలఁగఁగ నెంచెగా చెలి ప ♦ దంపడి ప్రాణములం దృణంబుగాఁ
బలుపలు వేయునేల? తెగు ♦ వం దనుదానె ననున్ వరించెగా. ౧౦

మఱియు, చెలికాఁడా! నీకు జ్ఞాపకము లేదా?

శా. నాయాసల్ విడనాడి నందనుని పెం ♦ డ్లామాటపన్ ముందుగా
నాయంబుల్ దెగినట్టులే పఱియొడ్జల్ ♦ స్వాధీనముం దప్పఁగా
నాయాసంబున నేడ్చుచుం బయికి నె ♦ య్యం బెట్లు తాఁజూపెనో
యీయింతింగని చింతపొంగి పొరలన్ ♦ హా! యేను నెట్లుంటినో. ౧౧

[ఆవేగముతో] అయ్యయ్యో!

*చ. ప్రిదులం నేకాని యూరటము ♦ పెల్లున డెందము రెండుగాదు; మైఁ
బొదవు నెకాని మబ్బుచెడి ♦ పోవద తెల్వియొకింతయేని, లోఁ
బొదలి దహించుఁగాని తను ♦ వున్ మసిఁజేయదు తాప; మాయముల్
గుదెగొని కొట్టుఁగాని తెగఁ ♦ గోయఁడు జీవము దైవమేమనన్. ౧౩

మక:- దైవమువలెనే సూర్యుఁడుగూడఁ దీవ్రత వహించి దహించి వేయుచున్నాఁడు. నీ శరీరావస్థ యిట్లున్నది. కాఁబట్టి యించుకసేపీ శా మరకొలనిదాపునఁ గూర్చుందము. ఇందు

మ. వెలికిం దోఁచు మృణాళదండములపై ♦ విప్పారు క్రొత్తమ్మిపూ
వుల పూఁదేనియ సోనలం బొదలు తా ♦ వుల్ గ్రోలియంతన్ విని
ర్మలకల్లోల విలోలశీకరతుషా ♦ రప్రాప్తిచే మెల్లనై
పొలయుం జల్లనిగాలి తెప్పిరిలుచుం ♦ బోల్పొంద నీప్రాణముల్. ౧౪

[ఇటునటునడచి కూర్చున్నారు.]

మక:- [తనలో] కానీ యిప్పుడు వీనిమనస్సు మరలించెదను. [ప్రకాశముగా] వయస్యా! మాధవా!

మ. కనులం గ్రమ్మతి నీరు గ్రమ్మకయ మున్ ♦ కాంచందగున్ నీకు నిం
దనయంబున్ స్థిరి కాటపటులగు నీ ♦ యబాకళోద్దేశముల్
ఘనహారస్వన మల్లికాక్షచలప ♦ క్షవ్యాహతింద్రూలి ని
గ్గెనయంబొల్చు మృణాళదండములతో ♦ నీపుండరీకావళిన్.

---

* ద్విపద.

ప్రిదులం నేకానియు ♦ ద్వేగంబుగలుగ। హృదయంబు విడిపోదు ♦ రెండుప్రక్కలుగ
వికలమై దేహంబు ♦ పెనుమూర్ఛఁదగులు। సకియఁగూర్చిన తెల్వి ♦ పావకేమిగులు
నొడలెల్లఁగాల్చులో ♦ నుడుకప్పతిల్లి। మడిసిపోదేమి భ ♦ స్మంబుగాఁజెల్లి
యాయముల్ దెగఁగొట్టు ♦ నారజీవంబుఁ। గోయఁదేయేమను ♦ రెండుదైవంబు.

పాఠాంతరము.

మాధ:- [ఆరాటముతో లేచుచున్నాఁడు.]

మక:- ఏమి యిది? నాగోడవ వినిపించుకొనకయే యెక్కడకో లేచి పోవుచున్నాఁడు! (నిట్టూర్పుపుచ్చి లేచి) మిత్రుఁడా! నామాట విని నిలువుము. చూడు.

మ. నదిపైఁ బ్రబ్బలి పూలురాలి జలమున్ ♦ వాసింపఁగాఁ జేసెడుం;
బొదలుం బూఁబొదలందు గట్టులపయిన్ ♦ మొల్లల్ ప్రఫుల్లంబులై;
యిదె యుత్ఫుల్లకదంబవాసి గురుభూ ♦ భృత్తిమలన్ నెమ్మి స
మ్మదమొప్పన్ నటియింప సానువులపై ♦ మబ్బుల్వితానంబులౌ.

మఱియు,

ఉ. శైలసమీపభూములను ♦ జల్లునబూఁచెఁ గదంబముల్, దిశల్
చాలమొయిళ్ళ చాలులను ♦ శ్యామములయ్యె, నెసంగెఁ బల్లపు
న్నేలలఁ గ్రొత్తమొల్కలును ♦ నీటగు గేదఁగి పూవులున్, వనీ
పాళి శిలీంధ్రలోధ్ర సుమ ♦ వాసనలన్ వికసించి మించెడున్. ౧౨

మాధ:- వయస్యా! చూచుచునే యున్నాఁడ నోయి. ఈ యరణ్యగిరి భూముల రామణీయకము చూడ శక్యముగాకున్నది. ఇది యేమిటి? [కన్నీళ్లతో] తెలిసినది.

ఉ. పూచిన మద్దివేగిసలఁ బొల్చెడితావులు దాల్చి తూర్పుగన్
వీచెడి యెూరుగాలికదె ♦ నిద్దపు నీలపుఁ దున్కలట్లుగాఁ
దోఁచుమొగుళ్ళు నల్లదలఁ ♦ దూలెడుఁ; గ్రొంజడివాన కుర్విపై
లేచెడుఁ గమ్మతావు; లాగి ♦ లేచెడుఁ జెమ్మట లద్దె చల్లనై
వేచెడు? వెండివచ్చినవి ♦ వెన్కటిప్రొద్దులె యిప్పుడక్కటా. ౧౩

హా! ప్రియురాలా! మాలతీ!

కవి. పరువపుఁ జీఁకటిమ్రాఁకులపోలికఁ ♦ బైపయి నల్లనిమబ్బులునున్
బొరిఁబొరిఁ జల్లనిగాలికిఁ దూలెడు ♦ నూతనవారి కణంబులు, సం

బర్హమునఁ గేరి నటించు నెమళ్ళ వి ♦ వాదకల ప్రతినాదములుఁ
సురవర కార్ముకదీప్తులు నొప్పఁగఁ ♦ జూడఁగ నావశ మా నెదిశల్.

[నిట్టూర్పుపుచ్చి శోకార్తి నభినయించుచున్నాఁడు.]

మక:- ఇప్పుడు చెలికాఁడేదో యతిదారుణమైన యవస్థలో నున్నాఁడు. (కన్నీళ్ళతో) అయ్యో! యెంతకఠినాత్ముఁడను! కనిపెట్టలేక వినోదము మొదలుపెట్టితిని. (నిట్టూర్పుపుచ్చి) మేమిప్పుడు మాధవుని విషయమున మా యాసలన్నియు సరిచేసికోవచ్చును. (భయముతోఁ జూచి) స్పృహ దప్పినది! హా! సఖీ! మాలతీ! యింకేమున్నదే? అయ్యో! జాలిలేనిదానా!

ఆ. వె. తల్లి యెఱుఁగకుండఁ ♦ దండ్రి యెఱుఁగకుండఁ
దెరువ నేసినాఁడు ♦ మగిడినేఁడు
నిరపరాధియైన ♦ నీ వల్లభునిమీఁద
జాలిమాలియుండె ♦ దేల చెలియ! ౧౯

ఏమిది? యిప్పటికిని ఊపిరి పుచ్చుకున్నాఁడు! అన్నా! మోసము చేసినాఁడు!

శా. ప్రయ్యెన్ డెందము, కీలుప ల్లెడలెడుం ♦ బాడై జగంబౌపడున్
ఒయ్యన్ లోనదహించి మోహమును దా ♦ నుద్దామమై కప్పు; సా
హాయ్యాపేక్షఁ గృశించు నాత్మయును గా ♦ ఢాంధంబులో మున్గెనా
నయ్యయ్యో! యిపుడేమి సేయఁదగుఁ గ ♦ ట్టా! మందభాగ్యుండనే.

ఎంతకష్ట మెంతకష్టము!

ఆ. వె. ఎవఁడు బంధుజనుల ♦ కెల్ల వెన్నెలపండుఁ;
యెవఁడు మాలతి కనుఁ ♦ గవకు ముద్దుఁ
జందురుం, డల మక ♦ రందమిత్రుఁడు జీవ
వర్గ తిలకమకట ♦ ప్రళయమొందె. ౨౦

హా! చెలికాఁడా! మాధవా!

తే. గీ. నాదుమేని గంధపుఁ బూఁత • నాదు కనుల
చందమామ నాదుహృదయా • నంద మెవ్వఁ
డాసొగసుకాని నిన్నుఁ నా • ప్రాణమట్లు
కాలమున నీడ్చు కాలుచేఁ • గూలితేఁగద. ౨౨

[స్పృశించుచు]

ఆ. వె. పలుకవయ్య చిన్ని • మొలకనవ్వోలయ! నఁ
గన్నొకింత విచ్చి • కనఁగదయ్య!
యిట్టి యుగ్రభావ • మేలయ్య? మేలయ్య
పరమమిత్రు మఱవఁ • బ్రాణసఖుఁడ! ౨౩

మాధ:- (తెలివినొందుచున్నాఁడు.)

మక:- (ఊర్పుపుచ్చి) ఇదిగో క్రొత్తగాఁ బులుంగడిగిన రాజపట్టముపగిది నిగనిగమని సొగసుమీఱు తొలిమొగులువలని శీకరాసారముచేఁ బ్రియవయస్యుఁడు తెప్పిరిల్లుచున్నాఁడు. అమ్మయ్య! కొంచెమూపిరి పుచ్చుచున్నాఁడు!

మాధ:- ఇప్పుడీ యరణ్యమందుఁ బ్రియురాలి కెవ్వరిచేత వార్తఁ బంపుదును? (చూచి) మేలు! మేలు!

మ. కమియం బండిన పండ్ల నల్లనగుచుం • గన్పట్టు జంబూనికుం
జములం దొ్రేలి సన్నగిల్లు నలరెన్ • జాల్వాఱు నేట్లావలన్
సుమహోత్తుంగ మహీధ్రశృంగగతమై • నూత్నాంబుదం బొండిదే
యమరుం బ్రోఁకతిమాలచూల్యరమణీ • యుస్వచ్ఛనీలచ్ఛవిన్. ౨౪

(తొందరగాలేచి యున్ముఖుఁడై దోసిలిపట్టి)

మ. నినువిద్యుల్లలతాంగి పాయకెప్పుడున్ • బ్రేమంబుమైఁ గౌఁగిలిం
చునుగా? నిన్నుభజించుగా సుముఖతన్ • శోభిల్లి సారంగముల్?

తోడ్పుగాలులు

వినుఁగొంపోయెదుగా సుఖంబుగను వి ♦ స్వేధిం బురోవాయువుల్
ఘన లక్ష్మీయుతదేవతాధిపధనుః ♦ ఖండాంక! సౌమ్యాగ్రణీ! ౨౪

(ఆలకించి) మేలు! గిరిగహ్వరంబుల నాలకింపనైన ప్రతిధ్వనులకు సంతోషంబునఁ గంఠంబులెత్తి నీలకంఠంబులు సేయు కలకేకారవంబులతో ననుబంధింపఁజేసి యీ ఘనుండు తన మంద్రహుంకారంబుచే నాకనుజ్ఞ యిచ్చుచున్నాఁడు. కాఁబట్టి యిప్పుడు ప్రార్థించెదను. భగవంతుఁడవైన జీమూతనాథా!

దాటిలు తనవట్టిన

శా. ఎందే మత్సతి మాలతిన్ జగతిఁ గం ♦ టేనిన్ యదృచ్ఛాగతిన్
ముందూరాడిచివెన్కా మాధవుని బా ♦ ముల్ దెల్పుమోయయ్య! నా
చందంబున్ వినిపించునప్డు తగదా ♦ కాతంతువుం ద్రెంచివే
యం; దానంజుమి యొట్టెటో నిలిచె న ♦ య్యబ్జాక్షికిం బ్రాణముల్. ౨౫

(సంతోషముతో) ఊఁ ఊఁ! బయలుదేఱినాఁడు! కనుక మఱొక్కడకుంబోయి విచారించెదను. (అని నడచుచున్నాఁడు.)

మక:- (ఆరాటముతో) ఇప్పుడు మాధవ పూర్ణచంద్రుని నువాత్త దోపరాగ మెట్లుగాఁ గ్రమ్మినది! హా! తల్లీ! హా! తండ్రీ! హా! భగవతీ! మాధవుని యవస్థను జూడవమ్మా! నన్ను రక్షింపవమ్మా?

మాధ:- అన్నా! యెంత ప్రమాదము!

క. లావణ్యము లొద్దగు త్రొం
బూవులు, చూపులఁ గురంగ ♦ ములఁ 'నడలఁగరుల్',
తీవలు మెయిసొబగునుగా
నీవిధమున మ్రింగివైచె ♦ నీయడవి చెలిన్. ౨౬

హా! ప్రియురాలా! మాలతీ!

మక: —

ఉ. ప్రాణసమానుఁడై సుహృదుఁ ♦ డై ప్రియుఁడై సహపాంసుకేళికా
సూనవిబద్ధసఖ్యుఁడయి ♦ యొప్పెడి యీసుగుణుండయో యిటుల్

చాననుబాసి గాసిలి న ♦ లంగి కలంగి మహార్తిఖేదముం
బూనఁగ రెండువ్రక్కలయి ♦ పోవిదియెట్టులు నీవు డెందమా. ౨౮

మాధ:- బ్రహ్మదేవునియొక్క సృష్టినైపుణ్యము పెక్కుచోట్ల నొక్కరీతిగానే యుండును. సరే యిప్పుడిట్లు కానిమ్ము. (మోకరిలఁబడి పెద్దగొంతుతో) ఓహో! పర్వతారణ్యవాసులైన మృగములారా! నేను మనవిచేసికొనుచున్నాఁడను. మీ రించుకసేపు చెవియిచ్చి విని నన్ననుగ్రహింపవలెను.

శా. కన్నారే! సకలాంగసుందరి నిటం ♦ గాంతారదేశంబునన్
విన్నారే! సతికేమి సంఘటిలెనో? ♦ విన్నాణియై ముగుఁదై [ఉన్మత్తయై / సుందరాంగియై]
యన్నారీమణి డెందమందొడలఁ బ్రా ♦ వృట్సుందు రాగిల్లునో [మన్మథుండు]
యన్నల్! ప్రాయపుఁ జిన్నెలివ్వి వినుఁడీ ♦ యజ్ఞాక్షి గుర్తింపఁగన్. ౨౯

అయ్యో! ఎంతపాపము!

చ. వెసఁబురివిచ్చి కేరుచును ♦ పీనులఁబెట్టదు నెమ్మి నామొఱన్
గొసరుచుఁ జేరెడుంజెలిఁ జ ♦ కోరము దారుణఘూర్ణితారమై [తండ్లతోటి]
కుసుమరజంబుపూసెదును ♦ గోమలిచెక్కటఁ గొండ్రుమచ్చయో
యసమయ మయ్యెనిన్నిటికి ♦ నక్కట యెవ్వరి నింక వేఁడుదున్. ౩౦

ఇక్కడ నింకొకటి,

ఉ. వాతెరకెంజిగిందొరసి ♦ పల్వరుసల్ దగ, రోచనీనును
వ్రాతమువోలెఁ జెక్కుఁగవ ♦ రక్తిమసూపఁగఁ, బండియున్నదై
మూతి పడల్చుదాడిమము ♦ పోల్కివహించు సఖీముఖంబుఁ దా
నీతఱిఁ బండుకోఁతి పయి ♦ కెత్తి పొరింబొరి ముద్దులాడెనున్. ౩౧

ఇదిగో నీవైపున మఱ్ఱిచెట్టు మొదలను మదపుటేనుఁగొకటి కంఠమానకొని నిలిచి యున్నది. ఇక్కడను అసమయముగానే యున్నది.

చ. దురదకుఁ గన్నుమూసికొను ♦ తొయ్యలిఁ గోకుచు దంతకోటిచే
వరుసఁగదల్చి వీనులను ♦ బాటిగఁ జల్లనిగాలి వీచుచుం,
గాతికి [illegible]గంబులందుగుచి ♦ గుళ్ళను నోరికి నందియిచ్చుచుం
బరిచయ మిట్లు సేసికొనఁ ♦ బాటుపడుక్ వనహస్తి కొత్తగన్. 32

(మఱియొక వైపుచూచి) ఇంకనిదియో.

చ. ఉఱుము మొయిళ్ళమాఱుకొని ♦ యుర్మదు మంద్రగభీరఘుంకృతిన్,
స్వరసఁగొలంకునుండి మృదు ♦ శైవలముం దెమలించి మ్రింగ, దే
హలుటమదంబు, నోళ్ళడఁగి ♦ నట్టియఘుల్లలవాల్మ్రగంబుతోఁ
గరి కరిణీవియోగమునఁ ♦ గ్రాఁగితపించెడు విహ్వలించుచున్. 33

కాఁబట్టి యాయాసపడుచున్నదానిని మఱింత యాయాసపెట్టుట గాని దీనినడిగిన ప్రయోజనము లేదు. (ఆనందముతో) ఇక్కడనే మఱియొక్క మత్తమాతంగ యూథనాథుఁడు తన మధుర గంభీర కంఠగర్జిత ధ్వనులచే వేడుకసేయుచుఁ బ్రియురాలితోఁ గూడిమాడి జలక్రీడలాడుచున్నవాఁడు. ఓహో! క్రొత్తగ వికసించిన కడిమిపూవుల తావులకుం దావలంబయి చల్లగ గండస్థలంబులనుండి సంతతధారగఁ బ్రవహించు మదోదకంబుచే గట్టులెల్ల నడుసుగట్ట, దొండమునఁబట్టి పెకలించి వైచిన పద్మషండములతూఁడులం, కాడలు, కేసరంబులు, కింజల్కములు, వలుగడలఁ దూలుచుండ, నెడతెగక తపతపఁగొట్టుకొను తోరంపు వీనుల తాఁకులకుఁ జెదరి చిదురుపలగు తరఁగలచాలు వల్లన బడిబడిఁ బయికిలేచు తుంపురుల
సారసప్రవేష్టలు
గుంపులకు నిలువలేక కురరసారసంబులు వెరచి పఱచుచుండ నీతని జలకేళి చాల రమణీయముగానున్నది. కానిమ్ము. ఇతనిం బలుకరించెదను. మహాభాగ! నాగవల్లభా! నీయావనము కొనియాడఁ దగినదికదా! ఊఁహూ! ప్రియురాలి యనుగ్రహము సంపాదించుకొనుటకూడ నెఱుఁగుదువు! (సమాపణముగా)

ఉ. లీలఁ దెమల్చి తూండ్లు గబ • ళింపఁగ మున్నిడె యంతఁబుక్కిటం
గొల్చిలిచె పద్మసౌరభము • గుమ్మనకమ్మనినీరు, లావయిన్
దేలిచె తుంపురుంజడిని • నీటుగఁ, దిన్ననికొండకామత్రో కావు యనే కాడ
నేలొకొ తామరాకుగొడు • గెత్తదు హత్తినకూరిమిం మదిన్. ౨౫

ఏమి! నాకుఁ బ్రత్యుత్తరమీయక నన్ను నిరసన చేయుచున్నది? అన్నా! ఎంతటిమూఢుఁడను! ఈవనచరునితో మకరందునితో సంభాషించి నట్లు సంభాషించుట నాదేతప్పు, హా! మిత్రుఁడా! మకరందా!

తే. గీ. ఎందుకే దిక్కుమాలిన • యేడ్పు బదుకు?
ఎందున ఫలానుభవము లే • నంద? మెందు
కదియు నీవునులేని గొ • ద్దురిన? మెందు
కవరొ ఘటియించు ముద మిసీ • యొండమావు. ౨౬

మక:-వింతగా నున్నది. ఇతఁడు మోహాంధకారములో మునిఁగి యుండియు నడుమనడుమ నన్నుఁదలఁచుకొనుచు నేయున్నాఁడు! ఇది చూడఁగా నీతనికి నాయెడఁగల సహజస్నేహముయొక్క సంస్కారము కునికి మరల నే హేతువుచేతనో తల యెత్తుచున్నది. కనుక నేను చెంత నున్నట్లే భావించుచున్నాఁడు. [ఎదుట నిలిచి] ఆ మందభాగ్యుఁడు మకరందుఁడు వీఁడె నీప్రక్కనే యున్నాడు.

మాధ:-హా! ప్రియవయస్య! నన్నుఁ గౌఁగిలించుకొని యాదరింపుము. ఇంక మాలతివిషయమున నిరాశుఁడ నైనాఁడను.

మక:-ఇదిగో ప్రాణేశ్వరుని సంభావించుచున్నాను. [చూచిజాలిగా] అయ్యో! నన్నుఁ గౌఁగిలించుకోవలెనని యభిలషించుచునే స్మృతి దప్పి నాఁడు! చాలు నింకమీఁద జీవితాశ యేడిపింప నక్కఱలేదు. ఏ విధమునఁ జూచినను నాకుఁ బ్రియవయస్యుఁడు లేఁడని సరిచేసికొనుటయే యుక్తముగా నున్నది. హా! వయస్యా!

తే. గీ. నేఁడి పొంగుగ నెయ్యంబు • పెంపుమీఱ
ననిశ మనిమిషమునఁ దెంద • మదరి నీకు
నాపదలు వచ్చెనని యే ధ • యంబుగనెనొ
నట్ట మయ్యెనదెల్ల త్ర • ణంబులోన. ౩౬

నాకుఁ జూడఁగాఁ గడచిపోయిన గడియలే మెఱుఁగుగాఁ గనఁబడుచున్నవి. ఏబాధలొందుచున్నను బ్రియమిత్రుఁడు జీవించి యుండుటను గన్నులతోఁ జూచుకొనుచుండెడివాఁడను. మఱియిప్పుడో నాకు,

శా. భారంబయ్యెశరీర మయ్యొ! బ్రదుకున్ • వ్యజంపు మేకయ్యె, ది
గ్వారంబయ్యెనుశూన్య మింద్రియములున్ • వ్యర్థంబులయ్యెన్, సుదు
ర్వారంబై తమమావరించె, నఖిల • ప్రాణి ప్రపంచంబునన్
ఘోరంబయ్యెను గాలమీపగిది న • న్నుంగూర్చి నీవేగుటన్. ౩౭

[ఆలోచించి] మాధవునిమరణముఁ గన్నులారఁజూచి యిప్పుడేమి చేయుదునని బ్రదుకుదును? కనుక నీగిరిశిఖరమునుండి పాటలావతిలోఁబడి యతనికన్న ముందుగానే పరలోకగతుఁడ నయ్యెదను [జాలిగా నిటునటు వెదకిచూచి] హా! యెంతకష్టము!

మ. సరసస్నేహవిలాస భాసురములై • జానొందు నాలేమ చి
తరవుంజూపులు, దేనఁ గ్రొత్తగన్నుమన్ • ద్రావం దటస్థించెనా
స్ఫురదిందీవరపత్రకాంతి యగుచున్ • శోభిల్లునీమేను సు
స్థిరతన్ బిగ్గఁగవుంగిలించియున్న దృ • ష్టింగాంచ నిష్టింతయున్. ౩౮

ఆహా! సమస్తగుణములకు గనియైనిల్చిన మహానుభావుని కిటువంటి యవస్థపట్టినది! మిత్రుఁడా! మాధవా!

మ. గ్రసియింపంబడె రాహుచే విమలరా • కాచంద్రబింబంబు దా
నికమంతై తొలివానమబ్బు విడిపో • యెన్ వాయువేగంబుచేఁ
బొసఁగంబండిన తీయమామిడియునున్ • బ్రోడయ్యె దావాగ్నిచే
నపమానప్రగుణాభిరాముఁడవు నీ • వయ్యో! మృతుండైతివిగా. ౩౯

9 దీర్ఘనాలంతారవేము

ఇట్లు గతించినవాఁడయినను బ్రియవయస్యునిఁ గౌఁగిలించుకొనె
దను. నన్నిప్పుడతఁడు కోరినకోరిక యిదియేకదా! [కౌఁగిలించి] హా!
వయస్య! హా! విమలకళానిధీ! హా! గుణగరిమ! హా! మాలతీ స్వయం
గ్రాహజీవితేశ్వర! హా! కామందకీమకరందానందముగ్ధచంద్ర! హా! మాధవ!
ఇదిగో నీవు జీవించియుండఁగా నీకు లభింపని మకరంద బాహుపరిష్వం
గము నీయవసానదశయందుఁగలుగుచున్నది! మిత్రుఁడా! యిటుపయిని మక
రందుఁడు క్షణమాత్రమైనను జీవించునని తలఁపవద్దు. ఏమంటేని,

తే. గీ. జనన మాదిగ నాదు పొ ♦ త్తున నె పెరిఁగి
తల్లి చనుఁబాలు సమముగాఁ ♦ ద్రావి యిప్ప
డొక్కఁడవును బంధులిచ్చు తి ♦ లోదకంబు
నాకు లేకుండఁద్రావుట ♦ న్యాయమగునె. ౪౦

[జాలిగా విడిచిపెట్టి యిటునటు నడచి] ఇదిగో నిదిగువను పాట
లావతి ప్రవహించుచున్నది. దేవీ! పాటలావతీ!

క. ప్రియమిత్రుఁడెందు ♦ దేహముఁ
గయికొనునో యందె నేను ♦ గయిగొంటయు నెం
డియు నతఁడెందేగునో యను
నయముగ నందేగుటయును ♦ నాకివికోర్కుల్. ౪౧

[అని పడఁబోవుచున్నాఁడు.]

సౌదా:- [తొందరగాఁ బ్రవేశించి నివారించి] వత్సా! సాహ
సము చేయకు.

మక:- [చూచి] అమ్మా! నీవెవ్వతవు? ఎందునిమిత్తము నన్నువారించు
చున్నావు?

సౌదా:- నీవు మకరందుఁడవేనా?

మక:- విడిచిపెట్టుము. ఆ మందభాగ్యుఁడను నేనే.

సౌదా:-వత్సా! నేను యోగినిని. మాలతి యంగమచ్చమును దెచ్చితిని. [వకుళమాలికను జూపుచున్నది.]

మక:-[తెప్పిరిల్లి జాలిగా] మాలతి బ్రతికియున్నదా?

సౌదా:-ఉండకేమి? వత్సా! మాధవుఁడేదేని బ్రతుకఁగోరని పని చేసిన వాఁడు కాఁడుగదా? శరీరత్యాగమునకుఁ బూనుకొన్నవాఁడవులే! నా యెడలు కంపించుచున్నది.

మక:-దేవీ! అతఁడు మూర్ఛనొంది పడియుండఁగా నిర కైనొంది విడిచివచ్చినాఁడను.

సౌదా:-అటయిన శీఘ్రముగాఁ బోదమురమ్మ. సంభావింతము. [త్వరితముగా నిటు నటు దిరుగుచున్నారు.]

మక:-[చూచి] అదృష్టవశమున వయస్యుఁడు తెలివినొందియున్నాఁడు.

సౌదా:-వీరి యిరువురి శరీరాకారమును మాలతిచెప్పినట్లుగా నేయున్నవి.

మాధ:-[ఊర్పుపుచ్చి] ఎవరుచెపుమా నన్ను మేలుకొలిపినారు? (ఆలోచించి) నిశ్చయముగా నీపని నాయవస్థ విచారింపక చేసిన యీ నవజలధరపవనునిదె. భగవంతుఁడ వైన యో పౌరస్త్యవాయూ!

శా. మోదంబుం గననిమ్ము చాతకములం ♦ భోదంబులంద్రిప్పుమీ
నాదం బిమ్ముగఁజేయ నిమ్ము శిఖులన్ ♦ జల్పింపు గేదంగులన్
ఖేదంబెట్టిటో మూర్ఛలో మఱచుచున్ ♦ నేనుండఁ జైతన్యమున్ తేలావి
వ్యాధిన్ వెండియుఁ దెచ్చిపెట్టి విరహిన్ ♦ బాధించెదేలాననున్!

మక:-జగత్ప్రాణుఁడైన యీవాయుదేవుఁ డిప్పుడు లెస్సయినపని చేసినాఁడు. మఱియు,

మ॥ అలరుం గేదఁగితావులూని నగరీ ♦ ప్రౌఢాంగనాస్యంబులి
మ్ముల లోలాలకవల్లిచాలనమిషన్ ♦ ముద్దాడి యుత్ఫుల్లనీ
పల్లవ శపుష్పకేరవోలు తదళి ♦ వ్యాహారరమ్యంబులై
లలితోద్యానిలముల్ వియోగుల నిటుల్ ♦ రారాపుల్లం బెట్టెడున్. ౪౩

మాధ:- భగవంతుఁడైన దేవవాయూ! మేలుకొల్పితివిగనుక నిన్నే ప్రార్థించుచున్నాఁడను.

చ. దళితకదంబ కుట్మలక ♦ దంబ పరాగముతోడిపాటుగాఁ
జెలిమెయొటనున్నదో యటకుఁ ♦ జేకొని చేర్పుమి నాదుప్రాణముల్
సలుపఁగఁజాలనేని యటు ♦ చామయొడల్ స్పృశియించి చల్లనై
యలరెడి వస్తువేదయిన ♦ నంపుము నాకిట దిక్కు సేవెగా. ౪౪

(అని దోసిలిబట్టి ప్రణమిల్లుచున్నాఁడు.)

సౌదా:- ఆవాలోకనంగుట కిదే మంచిసమయము. (దోసిటవకుళమాలిక నుంచుచున్నది.)

మాధ:-(సాకూతముగాను సహర్షముగాను సవిస్మయముగాను) ఇది యెట్లు? కామోద్యానమందు నేను రచియించి పంపఁగా ప్రియురాలు తన గుబ్బచన్నులమీఁదఁ దాల్చి ముద్దుసేసిన పొగడపూదండయిది. (చక్కఁగాఁ బరిశీలించి చూచి) సందేహమేల? అదేయిది.

చ. కలికి నవేందు సుందర ము ♦ ఖంబును గాంచఁగ హేలమై నిర
గ్గళముగఁ బుట్టినట్టి కుతు ♦ కంబును లోన నడంచు కొంటకై
యలరులు హెచ్చుదగ్గులుగ ♦ నట్టిట్టు వెట్టి రచించినట్టిదిఁ
బొలుపుగ నాలవంగికకు ♦ మోదము వెంచె మహాప్రసాదమై. ౪౫

(వెఱ్ఱిసంతోషముతో లేచి) ఓకోపశీలురాలా! మాలతీ! ఇదియంతే యుఁజూచుచు నూరకున్నావా? (కోపపడినట్లు) ఓసి నాయవస్థయెటులుం గనిదావా?

చ. పెదలెడిరీతిఁ బ్రాణములు ♦ వీడ్వెడి పోలిక నెందమట్టెమం
డెడుగతి నంగకంబులును ♦ నిండఁగఁ గ్రమ్మినమాడ్కి మోహమీ
వడువుననుండ మేలముఁజె ♦ వైళమ పోవఁగఁ జెల్లుఁగాక, నా
యొడ దయమాలి యుండఁదగు ♦ నే? కనుఁబండువు సేయఁగాఁగదే.

(అంతటఁ జూచి విసుగుతో) ఏదీ యిక్కడ మాలతి? (వకుళమాలను జూచి) ఆహా! ప్రియురాలికి నచ్చిన నెచ్చెలివయి పరమోపకారముం జేసితివిగదే?

ఉత్సాహ. ఎదురులేక బెట్టిదముగ ♦ నించువిలుతుఁ డేచి పె
ల్లిదపు వలపుఁదలఁపునిలిపి ♦ లీల మరులుకొలుపఁగాఁ
గదిసి నీవు సుదతి కపుడు ♦ కౌఁగిలిచ్చి తనియనా
పొదువుఁ గౌఁగిలయ్యెఁజెలియ! ♦ ముదితఁబ్రోవఁగలుగుటన్.

(జాలిగా నిట్టూర్పు పుచ్చి)

మ. బలితంపుం జెలికారపు న్నెలవులై ♦ గాఢానురాగంబులై
యలరుం గైదువు జోదువేఁడిమికి సా ♦ హాయ్యానుకూలంబులై
కలితానందము లొంచు నాగళమునం ♦ గళ్యాణి కంఠంబునం
బలుమారైన భవద్గతాగతములన్ ♦ భావించి దుఃఖించెదన్. ౪౫

(హృదయమందుంచుకొని మూర్ఛకొందుచున్నాఁడు.)

మక:-(చేరవచ్చి) చెలికాఁడా! ఊఱడిల్లుము.

మాధ:-(ఊఱడిల్లి) వయస్యా! మకరంద! నీవు చూడలేదా యేమి? ఎందుండియో మాలతి చటుక్కునఁ దనహస్తమును నాకొసంగినది. ఇది యేమని భావించెదవు?

మక:-ఈ పూజ్యురాలు యోగీశ్వరి. ఈ మాలతీప్రత్యభిజ్ఞానమును గొనివచ్చినది.

మాధ:-(దోసిలిపట్టి) అమ్మా! అనుగ్రహించి నా ప్రియురాలు జీవించియున్నదేమో చెప్పుము.

సౌదా:-వత్సా! ఊఱడిల్లుము. ఆ కళ్యాణి జీవించియున్నది.

మాధ:-మక:-(ఊర్పుపుచ్చి) అమ్మా! అటయ్యిన నీవృత్తాంతమేమో సెలవిమ్ము.

సౌదా:-వెనుకఁగరాళశక్తిగుడిలో నఘోరఘంటుఁడను ఖడ్గపాణి యొకఁడు హింసింపఁబడినాఁడు.

మాధ:-(ఆవేగముతో) అమ్మా! చాలు నామీఁదఁ దెలిసినది.

మక: - మిత్రుఁడా! ఏమిటది?

మాధ: - వయస్యా! మఱేమున్నది? కపాలకుండల కోరిక యీడేరినది.

మక: - అమ్మా! ఇది యిట్లేనా?

సౌదా: - వత్సా! అట్లే. ఇతఁడు చెప్పినట్లే.

మక: - అన్నా! యెంతకష్టము!

తే. గీ. అలఘు తిరశ్శోభఁ గనుపొంటెఁ ♦ గలువకొలనఁ
గలయ శరదిందుచంద్రిక ♦ గాసి సేసి
మేలంగనె యుండి యుండు న ♦ కాలమేఘ
వితతి యెడఁబాపె నేమి దు ♦ ర్విధియొకాని. ౧౯

మాధ: - హా! ప్రియురాలా! మాలతి! అతిభీభత్సమగు కష్టమనుభవించితివి!

తే. గీ. అల కపాలకుండల చేత ♦ నప్పు డీవు
చిక్కియెట్లుంటివో కదా ♦ చిగురుబోఁడి
రెచ్చిగిడొనర్చెడి ధూమ ♦ రేఖచేత
నలమికొనఁబడ్డ జాబిల్లి ♦ కలయఁపోలె. ౨౦

భగవతి! కపాలకుండలా!

తే. గీ. లాలనీయము దాని చె ♦ ల్వంబు నీకుఁ;
బాతకవు గాక మఱి శివ ♦ తాతివైతి;
సురభి కుసుమంబుఁ దలఁదాల్పఁ ♦ జూచఁ గాక
నలిపి వైచునె వఁడు చర ♦ ణములఁ ద్రొక్కి? ౫౧.

సౌదా: - చాలు, నీకళవళపాటు విను,

క. ఆమోదఁ దత్పరిపంథని శత్రుప్రసై
నై యే నష్టపదకున్న ♦ నది పాపంబుం
జేయుటకు వెనుకఁదీయదు
పో! యతిదుష్కరణాచారాలు ♦ బుద్ధిఁదలంపఁగ. ౫౨

ఉభయులు: - (ప్రణమిల్లి) మహానుభావురాలికి మాయెడఁ బరిపూర్ణానుగ్రహమున్నది. నీవు మాకు నిర్హేతుక బంధువురాలవనియే కాని నీవెవ్వరో మేమెఱుఁగకున్నారము.

సౌదా: - ఇదిగో తెలిసికొందురుగాని. (లేచి) ఇప్పుడు నేను,

తే. గీ. గురులసేవించి కావించి ♦ ఘోరతపము
మంత్రతంత్రసమాధుల ♦ మహిమలభ్య
సించిపడసినయాకర్ష ♦ సిద్ధిమీకు
భంబునకుఁగాను వినియోగ ♦ పఱచుదాన.

(మాధవునితోఁగూడి నిష్క్రమించుచున్నది.)

మక: - ఏమి మాయ గానున్నది?

తే. గీ. అంతలో మెఱుపంతలో ♦ నంధకార
మగుచు మిఱుమిట్లుగొని కన్ను ♦ లట్టె మొగిడి
వెఱపుగనె రెడు (చూచి భయముతో) లేఁడేమి ♦ ప్రియవయస్యుఁ
(ఆలోచించి) డౌను దెలిసిన దిదిసిద్ధ ♦ రాలి మహిమ. ౫౪

౧౮

(సవితర్కముగా) ఇది యేమో యనర్థహేతువని యెంచుఁగల భారఁ బడుచున్నా నేను?

ఉ. అచ్చెరువయ్యెడున్ మిగుల ♦ నప్పటి యాకథ లెల్ల జ్ఞప్తికిన్
వచ్చెడు; భీజ్వరం బెగుర ♦ వైచెడుఁ గొత్తగఁ బుట్టి; యంతలో
నచ్చుపడుం గడుం దెలివి ♦ యాక్షణమే నశియించి మబ్బుగాఁ
జొచ్చెడుఁ; జిత్రమై మదిని ♦ శోకము మోదము నెందుఁగూడెడున్.

కావున నీ యరణ్యావసానమున సుహృద్వర్గములోఁ బ్రవేశించి యుండు భగవతికడకుంబోయి యామె కీవృత్తాంతమును నివేదించెదను.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

నవమాంకము—సంపూర్ణము.

—o—

# మాలతీమాధవము

## దశమాంకము

రంగము:— పూర్వోక్తారణ్యమందు మఱియొకవైపు.

[తరువాతఁ గామందకీ మదయంతికా లవంగికలు ప్రవేశించుచున్నారు.]

కామం:- (జాలిగా, కన్నీళ్ళతో) హా! బిడ్డా! మాలతీ! నా యొడిలో నలంకారముగాఁ గూర్చుందువు గదే! యిప్పుడెందుఁబోతివే? మాఱుపలుకవేమె?

ఆ. వె. జనన మైనదాదిఁ ♦ గనుల పండువుసేసి
గడియ కొక్కసుద్దు ♦ నడపి యింపుఁ
బెంచు నీదు చిన్నె ♦ లెంచంగ నవి యొదల్
దగులఁబెట్టు గుండె ♦ పగులఁ గొట్టు.

మఱియు నోసి కూతుఁరా!

తే. గీ. వ్యవధిలే కేడ్పునవ్వులు ♦ వరుసఁ బొలయ
మొలక పలు మొగ్గ లొకకొన్ని ♦ ముద్దుగులుక
వచ్చియును రాని తొక్కుడుల్ ♦ ప్రమద మొసఁగ
నమరు చిననాఁటి నీముఖ ♦ కమలమెంతు.

ఇతరులు:- [కన్నీళ్ళతో] హా! ప్రియసఖి! సుప్రసన్నముఖ చంద్ర సుందరి! ఎందుఁబోతివే? ఆ క్రూరదైవము దిక్కుమాలినదానవైన నీశరీరమున కేమి యనిఘాతముఁ దెచ్చిపెట్టినాఁడో గదే! హా! మహాభాగ! మాధవ! నీవలనఁ బ్రాణిలోకమునకు గలిగినయుత్సవ మస్తమించుట కుదయించినంతసేపైనను బట్టకపోయెనే!

కామం: – (సవిశేషఖేదముతో) హా! బిడ్డలారా!

క. నవరాగరసము సుభగము
నవుమీఁదిగి కవుఁగిలింత ♦ యలవిధినియతిక
లవలీలవంగముల పెనఁ
కువ నుడిగాలికినిబోలెఁ ♦ గూర్పెదలి చెడెన్. 3

లవం: – (ఆరాటముతో) హా! క్రూరవ్యాపారయమా! వజ్రముతోఁ జేయఁబడితివి కాఁబోలును. నీయాస లుడిగినను బ్రక్కకు రాకున్నావు. (అని బొమ్మ మోదుకొని మూర్ఛిల్లుచున్నది.)

మద: – చెలీ? లవంగికా! కొంచెమునే పూఁబడిల్లియుండవే!

లవం: – చెలీ! మదయంతికా! ఏమి చేయుదునే? వజ్రలేపము పెట్టి యతికినట్లు ప్రాణము నన్ను వదలి పోకున్నదే! A?

కామం: – వత్సా! మాలతి! పుట్టినదిమొదలు నీకు లవంగికమీఁదఁ బంచప్రాణములుగదా! అది నీకొఱకుఁ బ్రాణములు విడుచుచున్నదే! ఏల జాలినొందవే అమ్మా? ఒకవంటి యాయున్నది వ్రాసి.

తే. గీ. దీపశిఖ స్నేహపూర్ణవ ♦ ర్తికను బోలె ఉపమాన మది
నుజ్జ్వలాలోకవైన నీ ♦ వొకట దీని
నుజ్జగింపంగ రాజిల్ల ♦ కున్నదిపుడు ఉదాహరింప నున్నది.
మొగము మసివాఱినట్టులు ♦ పొలుపఱంగ. అందమే పోగా ౪

హా! కల్యాణీ! నీవు కామందకి నెట్లు వదలిపెట్టుచున్నావే? ఓ దయావిహీనురాలా! నీవు వెచ్చగా నాయొడిలోనే కాదఁటే పెరిఁగి పెద్దదాన వైతివి?

వెలువడిన మాట కూడ

ఉ. కొంచక నిన్నుఁ బాల్యదుపు ♦ గోలెను దంతపుబొమ్మఁ బోలె నా
డించితిఁ; బెంచి పెద్దగ ఘ ♦ టించితి బుద్ధులు నేర్పి; పెండ్లి గా
వించితి మంచియోగ్యుఁడగు ♦ పెండ్లికొమారునిఁజూచి తెచ్చి; యి
ట్లెంచఁగ నీకుఁ బ్రేముడిని ♦ నెక్కుడుగానఁటె యమ్మ కంటికిన్. ౫

ప్రేమచే

(విలవిలలాడుచు) హా! చంద్రముఖి! యిప్పుడు నిరాశురాలనైతిని గదే!

ఉత్సాహ.

మొలకనవ్వు నిర్నిమిత్త ♦ ముగను ముద్దుమొగమునం
దొలcక, నుదురుసిగయు గార ♦ ధూప ధూపితములుగాc
గులికి యొడిని నీదుచన్ను ♦ గుడుచుకొడుకుc జూడcగా
గలుగు భాగ్య మెందవదయ్యె ♦ నాయభాగ్య మేమనన్.

లవం: - అమ్మా! భగవతి! అనుగ్రహింపుము. ఇంకc బ్రాణములను నిలుపcజాలను. ఈ గిరి శిఖరమునుండి క్రిందcపడి చచ్చి సుఖపడియెదను. ముందు జన్మమునందయినను నేను బ్రియసఖిని జూడcగలుగులాగున నాకు దేవి యాశీర్వచన మిచ్చుcగాక! (అని గిరి శిఖరమునుండి పడcబోవుచున్నది.)

కామం: - ఓసీ! లవంగికా! బిడ్డనుబాసి కామందకిమాత్రమింక మీcద బ్రదుకcగలదcటే? ఈ వియోగదుఃఖము మన యిరువురకును సమానమే. మఱియు,

తే. గీ. కర్మలకు భిన్న ఫలములు ♦ గలుగుకతనc
గలుగుc గలుగక పోవు సం ♦ గమము మనకు;
నైనc బ్రాణపరిత్యాగ ♦ మందు మాత్ర
మల్పము సంతాప శాంతియన్ ♦ ఫలము గలదు.

లవం: - భగవతి సెలవిచ్చినట్లే. (అని లేచుచున్నది.)

కామం: – (దయతోcజూచి) వత్సా! మదయంతికా!

మద: - అమ్మా! యేమిసెలవు? ముందు నడువుమనెదవా? అందుకు సిద్ధముగానేయున్నాను.

లవం: - చెలీ! నాబుద్ధివిని యీ యాత్మనాశ ప్రయత్నమును గట్టిపెట్టుము, నన్ను మఱచిపోకుము.

మద: - (కోపముపచ్చినదానివలె) పోవే! నేను నీవు చెప్పినట్లు వినుదానను గాను!

కామం: - అయ్యో! యీబిడ్డ దారుణము తలపెట్టినది.

మద: - (తనలో) నాథా! మకరందా! నీకు నమస్కారము.

లవం: - దేవీ! యిదియే మధుమతీ ప్రవాహముచే బవిత్రపాదమైన పర్వతవిటంకము. (హద్దె)

కామం: - ఇంక నాలస్యమెందుకు? (అందఱును బడఁబోవుచున్నారు.)

[తెరలో]

ఆశ్చర్యము!

తే. గీ. అంతలో మెఱుపంతలో నంధకార
మగుచు మిఱుమిట్లుగొని కన్నులట్టె మొగిడె
వెఱపుగొలిపెను;
కామం: - (చూచి హర్షవిస్మయములతో) ఏమి నా బిడ్డవీఁడె!
మక: - (ప్రవేశించి) అగుచు నిదియెల్ల నలసిద్ధు రాలిమహిమ. హా

[తెరలో]

ఏమి జనసమ్మర్దము! అతిదారుణముగా నున్నది!

తే. గీ. మాలతి యవస్థఁ దలిసె సంసారమందు
జీవితమునందును విరక్తిఁ జెంది భూరి
వసువు కృతనిశ్చయుండయి వహ్నిసార, సు
వర్ణబిందుఁ జేరని యేటి బ్రతుకు మాకు.

మద: - లవం: - ఇప్పుడే మాలతీమాధవులఁ జూడఁగలుగుదుమన్న సంతోషమును ఇప్పుడే భూరివసువును గుఱించి దుఃఖమునా?

కామం: - మక: - అన్నా! అదృష్టమును కష్టమును! వింతగా నున్నది!

తే. గీ. అంపపుంగోఁత, మంచిగం ♦ దంపుఁబూఁత
యేమియిది యేకకాలమం ♦ దే ఘటిల్లె!
మబ్బుగనఁబడ దిదియేమి ♦ మాయొఁకురియు
నగ్నికణములు నమృతంబు ♦ నవిరళముగ. ౧౦

తే. గీ. విసము సంజీవనిఁ గలయఁ ♦ బిసికినట్లు
చీఁకటిని వెల్గు నేకంబు ♦ సేసినట్లు
కులిశ శశికరముల జత ♦ గూర్చినట్టు
లయ్యెఁబో! యిప్డుమనభాగ్య ♦ మరసిచూడ. ౧౧

[తెరలో] హా! తండ్రీ! ఉడుగుము. నీ ముఖపద్మమును జూడవలెనని మనసు పడుచున్నాను. దయఁజూచి నన్నాదరింపుము. ఆహా! నానిమిత్త మాచక్రవాళభూచక్రమునకెల్ల మంగళైక నిర్మలప్రదీపమగు నీ దివ్యదేహమును బరిత్యజించుచున్నావు! నేనెంత నిర్దయురాలనో కాని మిమ్మునందఱను విడిచి సిగ్గునొందకున్నాను?

కామం:-హా! బిడ్డా! మాలతీ!

తే. గీ. చచ్చి బ్రతికినయట్లుగా ♦ వచ్చినీవు
కంటఁబడితివో లేదో యీ ♦ వెంటనిపుడె
చంద్రకళ మ్రింగ రాహువు ♦ చందమునను
సిద్ధమైయున్నది మఱొక్క ♦ చెడుగు నీకు. ౧౨

మద:-లవం:-హా! ప్రియసఖీ!

[అప్పుడు మూర్ఛనొందిన మాలతినిదీసికొని మాధవుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మాధ:-ఎంతకష్ట మెంతకష్టము!

తే. గీ. వెలఁదుక ప్రవాస మెట్లొ తా ♦ వెళ్ళఁబుచ్చి
వెండి సంశయించెను నొందు ♦ విధముగాను;
పండియుండఁగఁ బ్రాణుల ♦ భాగ్యఫలము
వెసఁ గుడువకుండ నెవఁడు త ♦ ప్పింపఁగలఁడు? ౧౩

మక:-చెలికాఁడా! మఱి యా యోగిని యెక్కడ నున్నది?

మాధ:-

ఆ. వె. ఇరువురమును గలిసి ♦ యే వేగ మొప్ప శ్రీ
పర్వతంబునుండి ♦ వచ్చినార;
మింతలోన నడవి ♦ నెవ్వరో మొఱపెట్ట
వినియె మాయుమగుమఁ ♦ జనియె సఖుఁడ ౧౪

కామం:-మక:-ఓ మహాత్మురాలా! మరల మమ్ముఁ గాపాడుము. మాకుఁ బొడసూప కున్నా వేమి?

మద:-లవం:-చెలీ! మాలతీ! ఇదిగో నీ చెలికత్తెలము మేము [వడఁకనొందుచు] అమ్మా! భగవతీ! రక్షింపుము! రక్షింపుము! దీని హృదయ మిప్పటికిని ఊపిరిపుచ్చక నిశ్చలముగా నున్నది! హా! భూరివసూ! హా! ప్రియసఖీ! మీరిరువురు నొకరినిమిత్త మొకరు ప్రాణములు విడుచుచున్నారు!

కామం:-హా! బిడ్డా! మాలతీ!

మాధ:-హా! ప్రియురాలా! మాలతీ!

మక:-హా! ప్రియసఖీ! [అందఱు మూర్ఛిల్లి మరలఁ దెలివి నొందుచున్నారు.]

కామం:-ఏమిది? యింతలోనే పట్టపగలు మబ్బుపట్టి మీఁద నీటి చినుకులు పడుచున్నవి! ప్రాణ మెంతహాయిగా నున్నది!

మాధ:-[ఊర్పుపుచ్చి] చూడుఁడు! చూడుఁడు! మాలతికిఁ దెలివి వచ్చినది! ఈమెకిప్పుడు,

మ. నెగయుం జన్నులు తొమ్మునన్ నిబిడమై ◆ నిట్టూర్పు లిట్టాడఁగా,
సొగసుం గన్నులు తొంటి క్రొన్నిగనిగల్ ◆ సూపించి దీపించెడున్,
మొగముం జక్కఁ గలంకదేఱెడును స ◆ మ్మోహంబు వాయంగ లేఁ
జిగటం గ్రొంజిగిఁ బొల్చి పొల్చి కననో ◆ పద్మంబు, చందంబునన్. ౧౫

[తెరలో]

తే. గీ. నందనసమేతుఁడై చర ◆ ణములఁ బ్రాలు
నుర్వీపతిఁ గయికొనకన్న ◆ నుఱుక నున్న
భూరివసువట్టె నామాట ◆ గారవించి
నురలుమన్నాఁడు హర్షవి ◆ స్మయములదర. ౧౬

మాధ:-మక:-దేవీ! యదృష్టము వర్ధిల్లుచున్నది!

తే. గీ. అలయనేయమ్మ వాగమ్ము ◆ తాంబుధారి
లంబుదము వారిధారల ◆ నలకరించి,
చేరవచ్చెదు మనల నా ◆ సిద్ధరాలు
వడిగఁ దొలఁగఁ ద్రోచికొనుచు ◆ వారిదముల. ౧౭

కామం:-ప్రియముగదా మనకు?

మాల:-అదృష్టవశమున నిప్పటికిఁ దెప్పిరిల్లినాను!

కామం:-[సంతోషభాష్పములతో] పుత్త్రీ! రమ్ము! రమ్ము!

మాల:-హా! భగవతియా? [అడుగులఁ బడుచున్నది.]

కామం:-[లేవనెత్తి కౌఁగిలించి శిరస్సుమూర్కొని.]

ఆ. వె. బ్రదుకవమ్మ నీవు ◆ బ్రదికింపవమ్మ నీ
ప్రాణసముని మఱియుఁ ◆ బ్రాణసఖుల;

హిమ సుశీతలాంగ కములఁ గౌఁగిటఁజేర్చి
సేద దేర్పవమ్మ చెలిని, నన్ను. ౧౭

మాధ:- వయస్యా! మకరందా! మాధవున కిప్పుడీ జీవలోకము పాదేయమైనది.

మక:- [సహర్షముగా] ఇది యిట్టిదే.

మద:- లవం:- ప్రియసఖి! నిన్నుఁ దిరిగిచూడ మనుకొంటిమి గదే! మమ్ముఁ గౌఁగిలించి యాదరింపవే!

మాల:- హా! ప్రియసఖులారా! [అని యిరువురను గౌఁగిలించుకొనుచున్నది.]

కామం:- వత్సలారా! యేమిటిది?

మాధ:- మక:- దేవీ!

పంచ. కపాలకుండలాగ్రహంబు గల్గఁజేసినట్టి యీ
యపారపు న్విపత్తునుండి యీమహాత్మురాలు మే
మపాయ మొందకుండఁగా ను పాయమొప్ప సత్కృపా
ప్రపూర్ణబుద్ధిఁ బూని మమ్ముఁ బట్టి యుద్ధరించెగా. ౧౮

కామం:- అఘోరఘంటునిఁ జంపుటచేతనే నా యింత పుట్టినది?

లవం:- మద:- ఓహో! యేమి యాశ్చర్యము! దైవయోగములో లంతనెంత దారుణమై చివర కెంతరమణీయమైనదో!

సౌదా.- [ప్రవేశించి] భగవతీ! ఇదిగో నీపూర్వ శిష్యురాలు మ్రొక్కుచున్నది.

కామం:- ఓహో! సౌదామిని! కళ్యాణము!

మాధ:- మక:- ప్రథమ శిష్యురాలైన యీ సౌదామినియెడ భగవతి కెంత పక్షపాతమో! అందుచేతనే యీమె యింతటి మహాకార్యము చేయుట తటస్థించినది.

* కామం:-

సుగంధి. రావెయమ్మ! రావెతల్లి ♦ రావె మ్రొక్కెదటికే
రావె నన్నుఁ గౌఁగిలించి ♦ రంజిలంగఁ జేయవే
యీవు నేనుఁజూచుకొంట ♦ యెన్నినాళ్ళకబ్బెనే
జీవమిచ్చి మంత్రికింబ్ర ♦ సిద్ధపుణ్యవైతివే. ౨౦

మఱియు,

మ. అలనాఁడైన ప్రమాణబీజము భవ ♦ ద్వ్యాపార పారీణతన్
ఫలియించెం గడు; ముచ్చటయ్యెడును నీ ♦ ప్రజ్ఞల్ గనుంగొన్న; లో
కులకున్నీయతిబోధి సత్వమహిమల్ ♦ కొండంతలై యీగతిన్
దెలియంగాఁ బడియెన్ గుమారి! జగతిన్ ♦ వీవేసుమీ వంద్యవున్.

మద: - లవం: - ఆ మహానుభావురాలు సౌదామిని యీమెయేనా?

మాల: - ఈమెయే. నన్నీమె భగవతి కామందకి యాదరించినట్లే యాదరించి కపాలకుండల నదలించి నన్ను విడిపించితెచ్చి తన యింటిలోఁ బెట్టుకొని యోదార్చినది. ఇంతేకాక నేనానవాలిచ్చిన పొగడ పూదండను జేతఁబట్టుకొని యిందులకు వచ్చి మిమ్ము నందఱ నుద్ధరించినది.

మద: - లవం: - మాచిన్న భగవతికి మామీఁదఁ బూర్ణానుగ్రహ మున్నది.

మాధ: - మక: - ఆహా!

---

* ఉత్సాహ. రమ్మ! రమ్మ! భూరివసువు ♦ ప్రాణమిచ్చి పుణ్యభా
రమ్మ! మూట గట్టుకొన్న ♦ ప్రణయభావసేవధీ!
అమ్మ! నిన్నుఁ గంటనేటి ♦ కబ్బె; నేఁజెలంగ మో
దమ్మునం గవుంగిలింపు ♦ తక్కుమేలమెచ్చఁగన్.

మూలము నెక్కువగా ననుసరించిన పాఠము.

కల్పవేలా

క. చింతింపం బడకుండం, జింతామణియైన మేలు ♦ చేకూర్పదు వా
వింతగద యింతమేలు న, చింతితముగ మనకు నీమె ♦ సేయుటచూడఁగ !

సౌదా:- (తనలో) ఆహా! వీరి యత్యంత సౌజన్యముఁ జూచి నాకు బిడియమగుచున్నది. (ప్రకాశముగా) దేవీ! ఇదిగో నందనుఁ డపరిమితానందముతో రాజుగారిని ప్రార్థింపగాఁ బద్మావతీశ్వరుఁడు భూరివసువు సమక్షమందు చిరంజీవియగు మాధవుని పేర లిఖించి పంపిన యుత్తరము. (అని యుత్తరమిచ్చుచున్నది.)

కామం:-[పుచ్చుకొని చదువుచున్నది] "స్వస్త్యస్తు"!

చ. "ఘనగుణసంపదం బ్రథమ ♦ గణ్యుఁగులీను, విరక్త దుస్తముఁ
ఘను నిను నల్లునిం బడయఁ ♦ గంటిని; గంటి ముదంబు; గావునం
దనరఁగఁ బూర్వరాగ ఘటి ♦ తఁ మదయంతిని సైత మిష్టని
స్నేగనీనయిష్టమితుగ్రినకు ♦ నిత్తుము వెండియు నీకుఁ బ్రీతిగఁ." ఇతి

[మాధవు నుద్దేశించి సహర్షముగా] వత్సా! వినుము.

మాధ:-విన్నాఁడను, సర్వవిధములఁ గృతార్థుడనైనాఁడను.

మాల:-అదృష్టవశమున హృదయమును బాధించుచున్న యీ శంకాశల్యముగూడ నిప్పుడు లాగివేయఁబడినది.

లవం:-ఇప్పుడు మాధవుని కోరికలు సంపూర్ణముగా నీడేరినవి.

మక:-[ముందువైపుచూచి] ఓహో! అవలోకితా బుద్ధరక్షితలలాగున్నారు. కలహంసుఁడుగూడఁ గనఁబడుచున్నాఁడు. వీరు దూరమునుండియే మనమందఱ మిందుండుటఁ జూచి సంతోషముతో నెట్లు గంతులు వేయుచు వచ్చుచున్నారో!

[తరువాత అవలోకితా బుద్ధరక్షితలును గలహంసుఁడును
బ్రవేశించుచున్నారు.]

[అందఱు వేఱువేఱుగా నృత్యముచేసి సమాపించి ప్రణమిల్లి కామందకి నుద్దేశించి] జయభగవతి! కార్యనిధానే! [మాధవు నుద్దేశించి] జయ మకరందనందన! మాధవపూర్ణచంద్ర! భాగ్యశాలివై వర్ధిల్లుచున్నావు! [అందఱును బెలుఁగవుతోఁ జూచుచున్నారు.]

అవం:- ఈమహోత్సవ సమయమందు సంతోషముచే గంతులు వేయనివా రెవరు?

కామం:- నిజమే. ఈవిధముగా మహాద్భుతమై విచిత్రమై రమణీయమై యుజ్జ్వలమైన ప్రకరణ మొందైనను గలదా?

సౌదా:- నాటకములో నెక్కుడు రమణీయమిది. మంత్రి భూరివసుదేవరాతులకుఁ బూర్వమును విద్యాభ్యాసమందున్నపుడు సంకల్పమునుండి యున్న కోరిక సంపూర్ణముగా నెరవేరుట.

మాల:- [చెవిలో] ఇది యెట్లు?

మక:- మాధ:- [కౌతుకముతో] దేవీ! జరిగినది యొక్కటియు దేవి సెలవిచ్చినది యొక్కటియును.

లవం:- [జనాంతికముగా] ఇప్పుడేమి ప్రత్యుత్తరము చెప్పఁదగినది?

కామం:- (చెవిలో) [బహిరంగముగా] ఇప్పుడు మదయంతికతోడి సంబంధము స్థిరపడినందున నందనునకుఁ గోపము వచ్చునేమోయను శంక మనకు వదలిపోయినదిగదా? [ప్రకాశముగా] వత్సలారా! జరిగిన దొకటియు నీవిడ చెప్పిన దొకటియుఁగాదు. ఏమన వారిరువురును జిన్నప్పుడు విద్యార్థి యవస్థలో నీసౌదామిని యెదుటనే "మనమపత్యము వియ్యమందవలయు"నని ప్రతిజ్ఞ చేసికొనిరి. ఇంక రాజుయొక్కయుఁ రాజపురుషుని యొక్కయుఁ గోపమీవిధముగాఁ బరిహరింపఁబడ్డదిగదా?

మాల:- ఓహో! ఇదియంతయు నాకారగోపనమా?

మాధ:- మక:- ఓహో! ముందొడఁబాటును వెనుకఁ దడఁబాటును! ఎట్లైననేమి మహాత్ములు కృతార్థులైనారు. ప్రత్యయవంతు లెప్పుడును గళ్యాణవంతులు.

కామం:- వత్సా!

మానిని. కోరికదీఱ ఘటిల్లినదీవల ♦ కుంజరజీవుల పెండ్లియొగిన్
వారల పుణ్యమునన్ మఱి నాజత ♦ నంబున శిష్యులక్లేశములన్
నేరుపుమై మదయంతిక యిప్పుడు ♦ నీసఖుతోడను గూర్పబడెన్
భూరిముదంబున నందఁగఁగల్గిరి ♦ భూరమణుండును నందనుఁడున్.

ఇంకను గోరఁదగినది కోరవచ్చును.

మాధ:- [సంతోషముతో] నాకింతకన్నను గావలసినదేమున్నది? అయినను భరతవాక్య మిట్లుండుఁగాక!

మంగళమహాశ్రీ.

మంగళముగావలెస ♦ మస్తభువనంబులకు ♦ మానవులు పారహితచింతా
సంగులయిముక్తకలి ♦ సంగులయిసందభి ♦ షంగులయివర్ధిలవలెన్! మే
ల్భంగరహితంపుఁ బ్రతి ♦ భంగరముధర్మపరి ♦ పాలనము సేయవలె రాజుల్!
పొంగఁ బ్రజలుల్లమునఁ ♦ బుష్కలసువృష్టికల ♦ వుల్ దఱిమి యీవలె
సుఖంబుల్.

మ. మగనిం బ్రొత్తగ జేర్పనెంచిమగువన్ ♦ మానొప్పఁగా సేసి యా
సొగసుం జెన్నెలవన్నె లద్దుగన్ ♦ సొంపెక్కఁగా దిద్ద ప్రౌ
ఢగతింబూని పునః పరిష్కృతము నా ♦ ట్యంపుం బ్రబంధంబు దీ
నిఁగడున్ మెచ్చికనాదరింప బుధులన్ ♦ జేయొగ్గి ప్రార్థించెదన్.

౧౭౭ —15

# మాలతీమాధవము

గద్యము. ఇది శ్రీజనమంచి వంశపావన బ్రహ్మావధాని తనూభవవిబుధ విధేయ వేంకటరామ నామధేయాంధ్రీకృతంబైన మాలతీమాధవంబను మహారణ్యప్రకరణంబునందు సర్వంబును దశమాంకము—సంపూర్ణము.

శ్రీపరమేశ్వరార్పణమస్తు.

---

Printed at Lodhra Press, Madras, Q. H. M. S. 158 and Published by J. Ramakrishna, Madras. T. P. No. E-146—250 copies 6/46.

Forget not my friend. B. S. R. Moorthy